# గీతావాణి

40



నాల్గవ సంవత్సరము  నాల్గవ సంచిక

గౌ॥ సంపాదకులు: సాహితీశ్రీ [illegible]

## శ్రీగీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 అక్టోబరు 1954

# విషయసూచిక - అక్టోబరు '54.

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజింగ్ ఎడిటర్:
శ్రీరామకృష్ణ

మేనేజర్:
స్వామి శ్రీ శివానంద,

గీతావాణి – ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సరచందా 4–0–0. * విడిపత్రిక 0–6–0

15th OCTOBER 1954.

♦♦♦♦ కవిత ♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦

# శ్రీ భగవద్గీతా సారము.

♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦ బాలకవి ఓ. నారాయణప్పగారు ♦♦♦♦♦♦

## త్రయోదశాధ్యాయము — క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

★

సీ॥ క్షేత్రంబు తనువగు క్షేత్రజ్ఞుడన దీని
నెఱిగెడివాడగు నింద్రతనయ!
ప్రకృతియుఁగా గుణముల పరిణామమేయగు
పురుషుండనగ బ్రకృతిబొంది ద్వంద్వ
కర్మజన్మాదుల గనలుచుండెడివాడు
విషయవిరాగియై వసుధనాత్మ
రతిసల్పునది జ్ఞానమతిమహిమాన్వితం
బఖిలాశ్రయంబయి యన్ని నెఱుగు

గీ॥ నదియె జ్ఞేయంబు దానిని నర్థిదెలియు
వారు బ్రహ్మంబుగాంతురు వసుధయందు
ననె హరి కిరీటికప్పుడు ననుచుదెల్ప
సకలజనమాత! శ్రీదాత!! సత్యగీత!!!

ఉదయించిన చంద్రుణ్ణి తానున్నచోటినుండే కౌగలించుకొనే చాతుర్యం ఒక్క కలువచెలువకే చెల్లింది. అలాగే అంతఃకరణంలోని గాంభీర్యాన్ని వదలని స్థిరచిత్తుడుమాత్రమే గీతాతత్త్వాన్ని ఆస్వాదించి ఆహ్లాదిస్తాడు.

— సంత్ జ్ఞానేశ్వర.




సంపుటి 4 ★ స్వస్తిశ్రీ జయ—ఆశ్వయుజమ్. ★ సంచిక 4

# వాసుదేవస్సర్వం.

"వాసుదేవోఽహం" – వాసుదేవుడు నేననునది జ్ఞానము. 'వాసుదేవస్సర్వం' — సమస్తము వాసుదేవుడనునది విజ్ఞానము. "సకలమిదమహం చ వాసుదేవః" – ఇది—అది, నేను—నీవు, సమస్తము వాసుదేవ పరబ్రహ్మమే.

"అహం బ్రహ్మాస్మి" – అనునది జ్ఞానము. "సర్వం ఖల్విదం బ్రహ్మ" – అనునది విజ్ఞానము. క్షేత్రజ్ఞుడు బ్రహ్మమనుకొనుట జ్ఞానము. క్షేత్రమూ—క్షేత్రజ్ఞుడూ, మొత్తము బ్రహ్మస్వరూపమనుట విజ్ఞానము. మొదటిది హంసభావము. రెండవది పరమహంసభావము. హంసదృష్టిలో నీరూ – పాలూ రెండున్నవి. పరమహంస దృష్టిలో అంతయు పాలే. ఆత్మానాత్మలను, ద్రష్టృదృశ్యాలను, క్షేత్రక్షేత్రజ్ఞులను, జడచైతన్యములను, జ్ఞాని (వివేకి) విభజించును. జడసత్తాను నిషేధించి (బాధించి) అన్వయదృష్టితో సర్వత్ర బ్రహ్మమును విజ్ఞానిదర్శించును. ఆత్మానాత్మలని జడచైతన్యములని వాని దృష్టిలో రెండు లేవు. ఉండేదంతయు ఒకే ఒక అఖండవాసుదేవ పరబ్రహ్మము. జగత్తు ఉందనుకొనుట దేహాభి

మాని లక్షణము. భగవద్దృష్టిలో జడవస్తువే లేదు. అదే పరమ హంసదృష్టి. అదే విజ్ఞానము.

మొదటిది అసంగభావము. రెండవది సర్వాత్మభావము. అసంగభావమును పొందక సర్వాత్మభావమును పొంద వీలులేదు. మొదటిది శివభావము. రెండవది విష్ణుభావము. జ్ఞానస్వరూపి శంకరుడు దిగంబరుడు. అదే అసంగభావము. ద్వితీయవస్తువులేని సర్వవ్యాపకభావము – సర్వాత్మభావము, అదే విష్ణుభావము. శైవుడు కాక వైష్ణవుడు కాకోరుట ప్రమాదకరమని పెద్దలమాట.

మొదటిది సాక్షిభావము. రెండవది బ్రహ్మభావము. సాక్షిభావమును పొందక బ్రహ్మభావమును పొంద శక్యముకాదు. బ్రహ్మభావమునందు సాక్షిసాక్ష్యములని రెండుండవు.

క॥ హరిమయము విశ్వమంతయు హరి విశ్వమయుండు సంశయము పనిలేదా
హరిమయము కాని ద్రవ్యము పరమాణువు లేదు. —

అని యిదేభావమును భాగవతము వెల్లడించినది.

సర్వము వాసుదేవుడైనపుడు, సర్వములో తానూ చేరియున్నాడు కావున, తాను వాసుదేవుడు కాకెట్లు పోగలడు? శ్రీ భగవాన్ రమణమహర్షులవారు భౌతికదేహముతో ఉండిన సమయమున ఒక చిన్నతమాషా జరిగినది. శ్రీవారు రేడియోప్రసంగాన్ని వింటూ కూర్చొనియున్నారు. రేడియోప్రవక్త (బ్రాడ్‌కాస్టరు) తన ఉపన్యాసమును ముగించుచు చివరలో "అందరికీ నమస్కారాలు" అని అన్నాడు. ఆ మాటవిని మహర్షివారు మందహాసముచేసి ఏమనినారంటే – "చూచారా! అందరికీ అనుటలో ఆ నమస్కారాలు తనకూ చెందినట్టే. అందరిలో తానూ ఒకడైయున్నాడు కదా!"

"వాసుదేవస్సర్వం" – ఇది గీతకు మహావాక్యము; సర్వోపనిషత్తుల సారసారము; వేదాంతమున తేలిన నిగ్గు. పరమఋషుల అనుభవక్షేత్రములో పండిన అమృతఫలము.




(గతసంచిక 7_వ పేజీ తరువాయి.)

“అర్జునా! నేను నిరహంకారుడను; నాకు కర్తృత్వాభిమానము లేదు. కావుననే ఈ జగదుత్పత్తి స్థితి ప్రళయరూపమగు కర్మము నన్ను బంధింపజాలదు. అజ్ఞానులగు వారు కర్తృత్వభోక్తృత్వాభిమానము కలిగియుందురు కాబట్టి, వారు కర్మజాలమున చిక్కెదరు. తద్ద్వారా జన్మము లెత్తెదరు. నేను స్వయం పరమేశ్వరుడను కాబట్టి నాకా కర్మలేపములేదు. వ్యవహారదృష్టిననుసరించి నేను కర్మనొనర్చువానివలె తోచినను వాస్తవముగ అకర్తను.” అని భగవంతుడు నాల్గవ అధ్యాయము పదునాల్గవ శ్లోకారంభమున సెలవొసగి వెండియు యిట్లనుచున్నాడు. ఇంతవరకు తనకు కర్తృత్వాభిమానము లేదనుటను వివరించి యిప్పుడు భోక్తృత్వాభిమానముసైతము లేదని స్పష్టము చేయుచున్నాడు.

“ఓ పార్థా! అది కావలయు_నిది కావలయునను ఆశకు లోబడి, అజ్ఞానులగు జీవులు కర్మఫలములగు స్వర్గాదుల నపేక్షింతురు. ఆప్తకాముడను – ఈశ్వరుడను నగు నాకు కర్మఫలములందు ఆశలేదు.”

“ఆప్తకామస్య కా స్పృహా”_ (ఆప్తకామునకు కోరిక యెక్కడిది) అని శ్రుతిసైతము చెప్పినది. సర్వాత్మదృష్టికలవానికి సర్వపదార్థములు ప్రాప్తములయ్యే ఉన్నవి. అట్టివాడె ఆప్తకాముడు.

అంకె చేరినపుడె సున్నకు విలువ. కర్తృత్వమున్నపుడె కర్మబంధకము. “ఈ పనిని చేయుచున్నాను; దీని ఫలము నాకు రావలెను” – అని కర్తృత్వముతోడను, ఫలాపేక్షతోడను అజ్ఞానులు కర్మముల నొనర్చెదరు. అవి వారికి బంధకములు కాగలవు.

భగవంతుడు అకర్త; అభోక్త యనెడి తత్త్వజ్ఞానమును పొందిన మహనీయులకు కల్గెడి ప్రయోజనమును శ్రీకృష్ణుడానతిచ్చుచున్నాడు.

"కిరీటీ! పరమేశ్వరుడు అకర్త; అభోక్త. అతడు నా ఆత్మస్వరూపి-యని అపరోక్ష విజ్ఞానమునుపొందిన మహాత్ముడుకూడ నావలెనే కర్మములచే బంధింప బడడు. అతడు ఆత్మయొక్క అకర్త్రాత్మజ్ఞానమును సంపాదించినవాడుకాబట్టి కర్మబంధ విముక్తుడే యగుచున్నాడు."

ఆత్మవిస్మృతియె బంధమునకు కారణము. తన్ను బ్రహ్మస్వరూపముగ తెలియుటె ముక్తి. కర్మయందు కర్తృత్వాభిమానము లేకుండుట, ఫలమునందు ఆశలేకుండుట ఆత్మజ్ఞుని స్వభావములు. ఈ స్థితిని గుర్తించి దానియందు దృఢముగ నెలకొనుటే మనుష్య జన్మముయొక్క సార్థకత.

ముముక్షువైనను ముక్తుడైనను కర్మబంధనివృత్తినికోరి కాని, లోకసంగ్రహార్థము కాని, కర్తృత్వభోక్తృత్వములను వదలి అసంగభావముతోకర్మలనాచరింపవలయునని రాబోవు పదునేనవ శ్లోకమున భగవంతు డాదేశించుచున్నాడు.

"సవ్యసాచీ! ఇదియంతయు నెరింగి పూర్వీకులు కర్మలనొనర్చిరి. పూర్వకాలమందలి ముముక్షువులు 'నేను కర్తను కాదు. భోక్తను కాదు' అని తలంచి కర్మములను చేయుచు వచ్చిరి. ఆవిధముగనె నీవున్నైత మాచరింపుము. అదెట్లు సాధ్యమగునని భావించెదవా? వినుము. నీవు ముముక్షుడవే యైనచో సర్వకర్త పరమేశ్వరుడని భావింపుము. ఆ భావన నవలంబించి కర్తృత్వమునుపరిహరించికర్మముల జేసినచో వాటివలన నీకు చిత్తశుద్ధి ఏర్పడగలదు. నీవు జ్ఞానివై యున్నచో ఇదంతయు వ్యవహారమాత్రమని యెఱిగి చేయుము."

ముముక్షువనిన, జన్మమరణరూప సంసారబంధమునుండి విడివడవలెననియు, పరమానంద స్వరూప పరమాత్ముని ప్రాప్తించవలెననియు అభిలషించువాడు. సాంసారిక భోగములు దుఃఖమయములనియు క్షణభంగురములనియువానినిశ్చయము. ఐహికాముష్మిక సుఖభోగములందు వానికి వాంఛ యుండరాదు. అట్టి వాడె ముముక్షువు.

ఈ శ్లోకమునకు శ్రీ శంకరభగవత్పాదులవారు భాష్యమును వ్రాయుచు "ఆత్మజ్ఞాని కానిచో అం

తఃకరణ శుద్ధికొరకును, ఆత్మజ్ఞాని యైనచో లోక సంగ్రహము కొరకును, పూర్వీకులగు జనకాదులవలె కర్మల నాచరింపవలె"నని చెప్పియున్నారు.

ఇట్లు భగవంతుడు అర్జునునకు నిష్కామభావముతో కర్మ నాచరింపవలెనని బోధించెను. కాని కర్మాకర్మ తత్త్వరహస్యము నెరుంగనిదె నిష్కామభావముతో కర్మనాచరించుట అసంభవము. ఆ హేతువుచే ముందుశ్లోకమునుండి కర్మాకర్మ తత్త్వమును భగవంతుడు బోధించుచున్నాడు.

"అర్జునా! కర్మమన నేమి? అకర్మమన నేమి? ఈ విషయమున బుద్ధిమంతులు సైతము తికమక పడుచున్నారు. కావుననే నీ కావిషయమును చెప్పబోవుచున్నాను. దానిని తెలిసికొంటివా, సంసార బంధమునుండి తప్పక విడివడగలవు.

నదీతీరమునందు కదలక మెదలకయుండెడి వృక్షములు, పడవలో ప్రయాణముచేయువానికి పరుగెత్తినట్లు తోచును. నడచిపోవుచున్న మనుష్యుడు దూరమునుండి చూచువానికి కదలక ఒకచోటనె యున్నట్లు అగపడును. అట్లే కర్మయొక్క అకర్మయొక్క వాస్తవమును సామాన్యులు గుర్తించుట లేదు.

శ్రుతిస్మృతులు విధించినవాటిని కర్మములనియు,తదితరములన్నియు అకర్మములనియు కొందరు చెప్పుదురు. శాస్త్రవిధాన మనుష్ఠించుట కర్మమనియు, వదలుట అకర్మమనియు మరికొందరిమాట.సహజముగ జరిగిపోవు శారీరక క్రియలన్నియు కర్మలనియు, వాటిని మాని వూరకుండుట అకర్మయనియు కొందరర్థము చెప్పుదురు.

ఇట్లు కర్మను అకర్మను గూర్చి పలువురు పలువిధముల భావించిరి. ఈ జటిల విషయము పండితప్రకాండులను సహా విభ్రాంతుల జేసినది. నీకా సంశయము కల్గకుండుటకొఱకై ఆ ముచ్చట నారంభించుచున్నాను. ఆ కర్మాకర్మముల తత్త్వము నెఱుంగుటచే ప్రయోజన మేమందువా;అశుభరూపమగు సంసార బంధమునుండి నీవు విముక్తుడవు కాగలవు.

కుంతీకుమారా! శాస్త్రవిహితమగు కర్మతత్త్వము తెలిసికొనవలెను. శాస్త్రము నిషేధించిన వికర్మముల తత్త్వముకూడ తెలిసికొనవలసినదే. అట్లే అకర్మమన నేమియొ తెలిసికొనుటొప్పును. ఈ

కర్మాకర్మ వికర్మముల తత్త్వము దుర్బోధ్యమైనది. శ్రుతిస్మృతిరూపమగు శాస్త్రము విధించిన కర్మముయొక్క వాస్తవస్వరూపమును తెలియక దాని నాచరించుటకలవిగాదు. అట్లే శాస్త్రము నిషేధించిన వికర్మయొక్కయు స్వరూపము నెరుంగకయె,దానిని పరిత్యజించుటకు వీలుండదు. అకర్మయనిన పనిపాటలు వదలిపెట్టి పూరక సోమరియై యుండుటేనా? దాని తత్త్వమేమి? దానినికూడ తెలిసికొనవలసినదే".

భగవంతుడీవిధముగ వర్ణించి చెప్పి పదునెనిమిదవ శ్లోకముతో కర్మాకర్మముల స్వరూప నిర్ణయమును అర్జునున కుపదేశించుచున్నాడు.

"పరంతపా! కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను యెవడు చూడగల్గుచున్నాడో, వాడేమనుష్యులలో బుద్ధిమంతుడు. వాడే యుక్తుడు. వాడే సమస్త కర్మముల నొనర్చినవాడు."

ఇది ఆ శ్లోకముయొక్క తాత్పర్యము.కర్మయనిన యిచ్చట సహజముగ చేసెడి క్రియాసామాన్యమున కంతటికేని అర్థము. కనుట వినుట తినుట తిరుగుట తెచ్చుటతలంచుట వచ్చుట యిచ్చుట పుచ్చుకొనుట నిశ్చయించుట మొదలగునవన్నియు కర్మములె. కేవల అగ్నిహోత్రాదిక ములనె యిచ్చట సూచించియుండలేదు. ఒక్క దేహముతోమాత్రమె కాక దేహప్రాణ మనోబుద్ధ్యాదికములతో నొనర్పబడు వ్యాపారము లన్నింటిని కర్మములనియె చెప్పనగును.ఆ కర్మలు దేహేంద్రియాదులందె ప్రవర్తించును కాని తన స్వరూపమగు ఆత్మయందు ప్రవర్తింపజాలవు. ఈ జ్ఞానమును పొందినవాడె కర్మయందు అకర్మను చూచినవాడు. దేహేంద్రియాదులెన్నెన్ని కర్మములందు ప్రవర్తించుచున్నను కూటస్థాత్మయొక్క అకర్మస్థితికి భంగములేదు. ఇట్లే అకర్మయందు కర్మను చూడవలెను. అదెట్లు? కర్మలనుమాని పూరకుండుటె యిక్కడి అకర్మమునకు అర్థము.ప్రవృత్తినివృత్తులు రెండును కర్తకు అధీనమైయుండుటబట్టియు, క్రియాకారక వ్యవహారమంతయు అవిద్యాక్షేత్రమునందుప్రవర్తించునదగుటబట్టియు, కర్మలను మానుటతో పూనుటతో పరమార్థవస్తువునకు సంబంధము లేదుకాబట్టియు, అకర్మయని చెప్పెడి యీ బాహ్యకర్మత్యాగముకూడ ఒకరూపమున కర్మయే అగుచున్నది. ఇట్లు అకర్మ

యందు కర్మను చూడవలెను. అట్లు చూచినవాడే పైగా చెప్పినట్లు మనుష్యులలో బుద్ధిమంతుడు. వాడే యుక్తుడు; యుక్తుడనగా యోగి యని అర్థము. వాడే సర్వకర్మములను నెరవేర్చినవాడు కూడ అగుచున్నాడు. అని కర్మాకర్మవేత్తను గురించి భగవంతుడు స్తుతించియున్నాడు.

నిజముగ చూచినచో, కర్మ రాజ్యము దేహేంద్రియాదులందె గాని అసంగముగు ఆత్మయందు ప్రవర్తింపదు. అయినను నేనుచేయుచున్నాననెడి ధర్మాధ్యాస వలన ఆకర్మము ఆత్మయందారోపింపబడుచున్నది. అదెట్లనిన — నదీతీరమందలి వృక్షములలో వాస్తవముగ గమనక్రియలేకున్నను, పడవయందు కూర్చొన్నవాడు పడవకదలికవలన వృక్షములందు గమనక్రియ నారోపించును. అట్లే శాస్త్రవిచారము లేని మూఢుడు అక్రియమగు ఆత్మయందు దేహేంద్రియాదులకర్మము నారోపించు చున్నాడు. ఆరోపితమగు ఆ కర్మయందు ఆత్మయొక్క — అకర్తృత్వమును బుద్ధిమంతుడు దర్శించగలడు.

సత్త్వాదికములగు త్రిగుణముల యొక్క — పరిణామములై యుండుట బట్టి దేహేంద్రియాదులందు కర్మవ్యాపారము లేకుండ యెప్పుడునుండదు. అట్లుండియు కర్మరూపములగు వాటియందు అవివేకి అకర్మనారోపించును. దూరమునుండి చూచినపుడు నడచుచున్న మనుష్యుడు నిలుచున్న మాదిరి యగపడును. నిజమునకు వాడు నడచుచునెయున్నాడు. చంద్ర నక్షత్రాదికములు నిరంతరగమనము చేయుచున్నను దూరపుచూపుకు వాటిగమనక్రియ కనబడుటలేదు. అవి క్రియారహితములుగ తోచును. అట్లే దేహేంద్రియాదికములు నిరంతర క్రియాశీలములై యున్నను, నేనేమియుచేయుటలేదనెడి అధ్యాసబలమువలన అకర్మము ఆరోపింపబడుచున్నది. పనులు మానియుండుటె అకర్మయనిభావించి ఆ అకర్మను దేహాదికములందు అవివేకి ఆరోపించుచుండ ఆ అకర్మయందు సైతము కర్మజరుగుచునే యున్నదని బుద్ధిమంతుడు గ్రహించగలడు.

ఈ విషయమును మరింత విమర్శించుకొందము. ప్రత్యక్షాదిప్రమాణజన్యమగు జ్ఞానమునకు విషయమగు ఈ జడరూపదృశ్యప్రపంచము కర్మ మనబడును. ప్రత్యక్షాది ప్రమాణ జన్యజ్ఞానమునకు అందక

కేవల స్వప్రకాశరూపమును సర్వ భ్రమలకు అధిష్ఠానమునైన చైతన్యము అకర్మయనబడును. ఏ పురుషుడు ఈ జగద్రూపమగు కర్మయందు సత్తాస్ఫురణ రూపముతో అనుస్యూతమై యుండెడి స్వప్రకాశాధిష్ఠాన చైతన్యమనెడి అకర్మను పరమార్థదృష్టితో దర్శింపగల్గునో; మరియు నే పురుషుడు ఆ స్వప్రకాశాధిష్ఠాన చైతన్యమనెడి అకర్మయందు మాయామయప్రపంచమనెడి కర్మము కల్పితమని, అనగా ద్రష్టృచైతన్యమునకును దృశ్యప్రపంచమునకును యెట్టి సంబంధమును లేదు కాబట్టి ఈ దృశ్యప్రపంచము ఆ ద్రష్టృచైతన్యమునందు వాస్తవముగ లేనేలేదని తెలిసికొనుచున్నాడో వాడు మనుష్యులలో బుద్ధిమంతుడు.

ఈ విషయమున శ్రుతి కూడ యిట్లు చెప్పినది.

"యస్తు సర్వాణి భూతాని
ఆత్మన్యేవానుపశ్యతి।
సర్వభూతేషు చాత్మానం
తతో న విజుగుప్సతే॥"

సర్వ భూతములను అధిష్ఠానాత్మయందు కల్పితములుగను, మరియు ఆ సర్వభూతములందును ఆత్మ తన సత్తాస్ఫురణ రూపములతో అనుస్యూతమైనదిగను యెవడు దర్శించుచున్నాడో వాడే అందరిలో శ్రేష్ఠుడు.

ఈ విధముగ చైతన్యాత్మకును దృశ్య ప్రపంచమునకును పరస్పరాధ్యాస యుండినను యెవడు శుద్ధ చైతన్యమును మాత్రమే చూడగలడో ఆ వివేకియే మనుష్యులలో బుద్ధిమంతుడు. ఈ వివేకము లేనివాడు బుద్ధిమంతు డనిపించుకొనజాలడు. కారణమేమనిన, వస్తువును ఉన్నదున్నట్లు తెలిసికొనువాడెగదా బుద్ధిమంతుడు. విరుద్ధముగ తెలుసుకొనువాడుబుద్ధిమంతుడుకానేరడు. త్రాడును త్రాడని గ్రహించువాడె బుద్ధిమంతుడు కాని, పాముని భావించువాడెట్లు కాగలడు? అట్లే, సర్వాధిష్ఠానమగు శుద్ధ చైతన్యమును దర్శించువాడె పరమార్థదర్శి కాగలడు. అతడే బుద్ధిమంతుడు. కాని అనాత్మప్రపంచమునుచూచెడి అజ్ఞాని మిథ్యాదర్శి యగుటబట్టి బుద్ధిమంతుడు కాబోడు.

ఆ పరమార్థదృష్టిగల పురుషుడే సమత్వబుద్ధికి సాధనమగు యోగముతో కూడినవాడై అంతఃకరణ శుద్ధినిబొంది యేకాగ్ర చిత్తుడగుచున్నాడు. ఆ కారణముచే అంతఃకరణశుద్ధికి సాధనములగు సర్వకర్మ

ములను చేసినవాడుకూడ నగుచున్నాడు. కాబట్టియే భగవంతుడు అతనిని బుద్ధిమంతుడని యోగయుక్తుడని కృత్స్నకర్మకృత్తని మూడు విశేషణములతో స్తుతించియున్నాడు.

ఈ శ్లోకమునకు మరి కొందరు క్రిందివిధమున అర్థము చెప్పుదురు.

పరమేశ్వర ప్రీత్యర్థమై చేయబడెడి అగ్నిహోత్ర సంధ్యావందనాది కర్మములు బంధమునకు కారణములు కావు. అందువలన అవి అకర్మములె యగుచున్నవని వివేకి కర్మములందు అకర్మమును దర్శించుచున్నాడు. ఆ నిత్యకర్మములను చేయక మానుటతో ప్రత్యవాయమను దోషము సంభవించుచున్నది. కాబట్టి వివేకి నిత్యకర్మలను మానుటయనెడి అకర్మలో ప్రత్యవాయకర్మను దర్శించును. అట్టివాడె బుద్ధిమంతుడు.

ఈ అర్థమును సూక్ష్మముగ పరికించినచో అసంగతమని తోచక పోదు. ఎందుకనిన — నిత్యకర్మమునందు ఇది అకర్మయని భావించుట త్రాటిని పామనుకొనునట్టి భ్రాంతి వంటిది. అట్టి భ్రాంతిజ్ఞానమువలన 'యద్జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్' అనినట్లు అశుభ సంసారనివృత్తి యనెడి ప్రయోజనము సిద్ధింపవీలు లేదు. ఆ జ్ఞానము భ్రాంతిమాత్రమె కావున స్వయముగ అశుభమైనది. అది బోద్ధవ్యమని చెప్పతగినదికూడ కాదు. దానిని పొందినవాడు బుద్ధిమంతుడని, యోగియని చెప్పుటకు అసలే తగదు.

మరియొకమాట యేమనిన — నిత్యకర్మములను చేయక మానుటతో ప్రత్యవాయము సంభవింపవీలులేదు. అభావమునుండి భావమెట్లు కలుగును? అట్లు కల్గవీలున్నచో, అభావము సర్వత్రనున్నది. కాబట్టి కర్మము సర్వత్రను ఉత్పత్తి కావలసియుండును. ఇది అనుభవ సమ్మతముకాదు.

స్పందరహితమగు కూటస్థాత్మయే అకర్మయని చెప్పబడును. క్రియాసహితమగు ఆకాశాది బాహ్యప్రపంచమును, మనోబుద్ధ్యాదిక ఆంతరప్రపంచమును కర్మమని చెప్పబడును. ఆ కూటస్థవస్తువనెడి అకర్మయందు ఈప్రపంచరూపమగు కర్మము ఆధారాధేయభావముతో కాని, ఉపాదాన ఉపాదేయ భావముతోకాని సంబంధపడి యుండ లేదనియు, కేవలము అధిష్ఠాన అధ్యస్తభావముతో నున్నదనియు యెఱింగి శాస్త్రజ్ఞుడు కర్మములను

చేయుచున్నాడు. దాసానిపూవు యొక్క యెఱుపుదనము స్ఫటికము నందు తోచునట్లు, దేహాది సంఘాతముయొక్క కర్తృత్వాది ధర్మము అసంగ కూటస్థమగు ఆత్మయందు అవివేకముతో ప్రతిభాసించుచున్నదని సాంఖ్యశాస్త్రము నుడువును.

ఉపనిషత్ తత్త్వజ్ఞులు చెప్పునదేమనిన — సువర్ణమువలన కలిగిన కంకణకుండలాదికములు సువర్ణరూపమే అయియున్నట్లు, బ్రహ్మము యొక్క వివర్తమే అయియున్న యీ జగత్తు బ్రహ్మరూపమే అయినది. ఈ జ్ఞానమును బొంది మహాత్ములు కర్మనొనర్చిరి.

శారీరక కర్మమే కర్మముగాదు. ఆత్మయందు లేనిపోని కర్తృత్వ భోక్తృత్వముల నారోపించుటయు కర్మమే. ఇట్లే, శారీరకకర్మములను వదలుటమాత్రమె అకర్మ కాదు. దేహేంద్రియాదులు విధివిరామము లేక పనిచేయుచుండుగాక! ఆ కర్మకును ఆత్మకును యెట్టి సంబంధము లేదనియు, అకర్తయనియు అభోక్తయనియు సాక్షియనియు తెలిసికొనుటయె నిజమగు అకర్మస్థితి. ఈ విషయమునే విస్పష్టము జేయుచు భగవంతుడు వాక్రుచ్చియున్నాడు.

"అర్జునా! ఆత్మ అకర్తయనెడి అనుభవమును పొందుటే నిజమైన అకర్మస్థితి. అంతేకాని, బాహ్యము నందు కర్మలను వదలి అది అకర్మ అనుకొనుట పొసగదు. అట్టివాడు కర్తృత్వాభిమానమును వేరొక మాదిరి వుంచుకొనియె వున్నాడు. వానిది కర్మస్థితిమాత్రమే.

వినోబా

---

గీతలోని ప్రతిశబ్దం కణకణలాడే నిప్పుకణము. అది పడ్డచోట పాపతాపాలు — భయమోహాలు భస్మంకాకపోవు.

—దీనానాథదినేశ.

నదీప్రవాహామువలె గీతావిచారధార నిత్యనవీనము.

— దినేశ్.

ఆంధ్ర భూమిలో

## ఆదర్శ గీతాప్రచారకులు III

# శ్రీ నోముల అప్పారావుగారు.

రచన: కార్యదర్శి - శ్రీ భజనసమాజము, కాకినాడ.



[శ్రీ పండిత నోముల అప్పారావుగారి సంగ్రహచరిత్రమును శ్రీకనకపల్లి భాస్కరరావునాయుడు B. A. గారు 1947 సం॥రమున పుస్తకరూపమున ప్రకటించియుండిరి. దానిలోని కొన్ని ముఖ్యాంశములను, శ్రీకార్యదర్శిగారు పంపిన విశేషవిషయములను చేకూర్చి ఈ వ్యాసము ప్రకటించితిమి. శ్రీ భజనసమాజ కార్యదర్శిగారి సహకారమునకు కృతజ్ఞులము.

— సం. ]



### జననము

శ్రీ పండితులవారు 1903 వ సం॥ నవంబరు 11 వ తేదిన జన్మించిరి. నవంబరు 11 వ తేదిని ఇంగ్లీషులో 'armistice day' అందురు. ఇది పుణ్య దినము. ఈ రోజుననే 1918 వ సం॥రమున భయంకరమైన యుద్ధము నిలచినది. ప్రతిసంవత్సరమును ఆరోజున పగలు 11 గంటలకు ఎక్కడివా రక్కడ రెండు నిమిషములు



నిలువంబడి ఈశ్వరధ్యానము చేయుచుందురు. రైలుబండ్లును ఎక్కడి వక్కడ నిలిచియుండును. తెలుగు పంచాంగము ప్రకారము ఆ రోజు శోభనకృత్ సం॥ కార్తీక బహుళ సప్తమీ బుధవారము. శోభనకృత్ అనగా శుభమును కలుగజేయునది. కార్తీకమాసము అధ్యా కముగా ఉత్తమము. ఈమాసముననే బందరులో శ్రీపాండురంగస్వామి ఉత్సవములు చేయుదురు. భక్తులు విఠల్‌నామములను వ్రాసిపంపుదురు. ఇక కృష్ణ బహుళ పక్షములలో బహుళము శ్రేష్ఠము. తిథులలో అన్ని కార్యములకు సప్తమి మేలైనదందురు. బుధవారము మేలైన వారము. ఇట్లు వీరి జన్మదినము అన్ని విధముల శుభప్రదమైనదిగా

ఎన్నఁదగియున్నది. వీరి జాతకచక్ర ములను జూచినవారు వీరు చిరంజీవు లగుదురని యిట్టి చక్రములను చూడలేదని ఆశ్చర్యము నొందుచున్నారు. గురుశుక్రుల పరివర్తన యోగము, విద్యాస్థానము పైని గురుదృష్టి కలదనిచెప్పెదరు. ఇట్లు గ్రహములు అత్యంతశుభకరములై యుండ ఈ మహాత్ముఁడు విశాఖ పట్టణము జిల్లా రాజాములో తమ మాతామహుని గృహమున జన్మించిరి. ముగ్గురు సోదరులలో వీరు మధ్యములు. వీరి తండ్రిగారగు సోమన్నగారు విశాఖపట్టణం జిల్లా పార్వతీపురమను పవిత్రనామముగల నగరములో వ్యాపారము చేయుచు సుఖగౌరవ జీవనము చేయుచుండిరి.

## మహత్తు.

వీరియందుగల మహత్తు బాల్యముననే కనఁబడుచువచ్చినది. ఇతరులవలన కానిపని వీరు వెళ్ళిన నెరవేరుచు వచ్చినది. మన బడులలో శ్రీ, చుక్క, దెబ్బయను పద్ధతి కలదుగదా. వీరు బడికి ఆలస్యముగా వెళ్ళినను తోడిబాలురు వీరిమీద ప్రేమచేత తమస్థానములను దాటించి, మొదటిస్థానము వారికి ఈవలసిన శ్రీకారము వీరికిఇచ్చేవారు. ఆడుకొనుబాలురే వీరియెడ నిట్టిప్రేమ గౌరవముచూపుట వీరియందెట్టి మహిమగలదో చెప్పకయె చెప్పుట యగుచున్నది.

## ప్రజాకర్షణ శక్తి.

ఇట్లు చిన్నతనమునందే భగవద్భక్తి ప్రజాకర్షణశక్తి వీరికిఉండినది. వీరు వీధిబడిలో నాల్గవ క్లాసువరకే చదివిరి. బడిలో వీరు ఇంగ్లీషు చదువలేదు. హిందీ, ఇంగ్లీషులు స్వంతముగా చదువుకొనిరి. సంస్కృతమైనను బాల్యముననే స్వల్పకాలము (8 సంవత్సరములు) శ్రీఆకెళ్ళ సుబ్బరాయశాస్త్రిగారివద్ద చదివినారు. ఇప్పటి పాండిత్యమంతయు స్వయంకృషివలననే లభించినది. వీరు ఛందస్సు నేర్చుకొనిన పిదప పద్యములు వ్రాయ నారంభించ లేదు. సుమారు 3000 పద్యములు లక్షణ గ్రంథములను చూడకయే వ్రాసిరి. వీరు వ్రాసిన కొన్ని మనోహరమైన పద్యములకు పేళ్లు తెలియక వానికి గీతిక లను పేరుబెట్టిరి. ఇట్టిమహిమ గలవా రెట్టివారై యుందురో మీరే యూహించవచ్చును. శ్రీ పోతనామాత్యునకుగల "సహజపాండిత్య" మను బిరుదు వీరికెంతయు తగియున్నదనిన అతిశయోక్తి కాదుగదా. సహానందమను వీరు వ్రాసిన పద్యకావ్యమున గద్యలో

"శ్రీమదుమారమణ రమణచరణ కమలసేవా నిరతసమస్తాపాయుం డును, పురాకృతసుకృతాధిగతపర మేశ్వర పరమకృపాభాగధేయుండు ను" అనియున్నది. అత్యద్భుత మైన వీరి పాండిత్యమునకు కారణ ము సర్వేశ్వరుని కరుణయనియును, పురాకృత సుకృతమువలనను, పర మభక్తి యుక్తివలనను కలిగిన ఆ కరుణయే అన్ని భాగ్యములకును కారణమనియును భావించవలసియు న్నది. నిజమునకు ఏకలవ్యునకు గురు వెవరు? విలువిద్యలో అర్జునునికూడ మించుటకు కారణము ఆయనగురు భక్తియే కదా. వీరి అత్యద్భుతమైన విద్యాసంపన్నతకు, వాగమృతధా రకు, డమరుక వాదోపమ గంభీర శబ్దోపన్యాసములకు, మహామహి మాన్వితులగుటకు వీరికి శ్రీ పరమే శ్వరునియెడఁగల పరమభక్తియును, నియమవర్తనమును, నిర్మలమాన సమే కారణములని చెప్పనగును. ఇట్టి భక్తులను జూచిన దయామ యుఁడగు పరమేశ్వరుని కేల దయ రాదు? వీరు మనకెల్లరకు ఎట్టినీతులు నేర్పిరో అట్లు తాము నడిచి మన కెల్లరకు ఆదర్శప్రాయులైరి. బ్రహ్మశ్రీ శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారిని, శ్రీ కస్తూరి శివ శంకర శాస్త్రిగారిని, శ్రీ ఆకొండ వ్యాసమూర్తి శాస్త్రిగారిని, శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులు గారిని, శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు మున్నగుమహనీయు లను నే నెఱుఁగుదును. వారి సం స్కృత వాఙ్మయ జ్ఞానోత్కృష్టత వీరు మనతెలుఁగునకుఁ దెచ్చుచున్న వారు. ఇట్లు అత్యద్భుత సాహిత్య జ్ఞానమేగాక సంగీతమునందును వీరికి గల అనుభవజ్ఞానము ఆశ్చర్యకర ముగానున్నది. తులసీరామాయణ ము చదువుచు ఎన్నోసారులు తద్వి షయసూచకములగు శ్రీ త్యాగ రాయకృతులను రాగతాళలయల పొందిక తప్పకుండ గానముచేయుట మన మెఱుగుదుము. ఇట్లు సంగీత సాహిత్యములు రెంటియందును ఇంతటి ప్రవీణత కలవారు వీరుగాక మఱియొక రెచ్చటనైనఁ గలరా యని సందేహించుచున్నాను. వీరు చదువని ఉత్తమసంస్కృతగ్రంథము కలదా? శ్రుతి, స్మృతి, శాస్త్ర, పురాణాది గ్రంథములలో వీరికి తెలియని ముఖ్యాంశము కలదా? యని గొప్పపండితులు ఆశ్చర్యము నొందుచుందురు. వీరు ఏ పద్యము గాని శ్లోకముగాని, మఱియేదిగాని యెన్ని సంవత్సరముల క్రిందట

ఒక్కసారి చదివియున్నను వినియున్నను అది అప్పుడే చదివినట్లు విన్నట్లు ఒప్పజెప్పగలరు.

వీరు 11, 12 సంవత్సరముల లోనే గీతాభాష్యమును చదువుచుండగా వీరినాయనగారుచూచి యింత చిన్నతనములో ఇంత పెద్ద గ్రంథము లేల చదివెదవని యడిగెడివారట. ఇవన్ని చూడగా వీరు ననుబోలిన పామరులను ఉద్ధరించుటకు అవతరించిన మహాత్ములని భావించవలసి యున్నది. ఇట్టి మహనీయుల సందర్శనసహవాస పాదస్పర్శభాగ్యము లభించుట పూర్వసుకృతపరిపాకము వలననే యని తలంచుచున్నాను.

బిరుదులు.

ఈయనకు (1) వేంకటగిరిలో 'అభినవతులసి' యను బిరుదమును (2) 'అభినవసూత' యను బిరుదమును, (3) కాశీలో 'సాహిత్యశిరోమణి' యను బిరుదమును, (4) అయోధ్యలో 'విద్యాభూషణ' యను బిరుదమును, (5) కాకినాడలో 'పౌరాణికరత్న' (6) 'అభినవవాల్మీకి' అను బిరుదమును, (7) అనకాపల్లిలో 'పండిత' అను బిరుదమును ఈయబడినవి. ఈబిరుదములవలన వీరికి గౌరవము కలిగినదనుటకన్న వీరి కిచ్చినందున ఆ బిరుదములకే గౌరవము కలిగెనేమోయని భావించెదను.

వీరి సంగ్రహ చరిత్రము.

వీరు 1903 వ సంవత్సరములో జన్మించిరని చెప్పియుంటిని. వీరు సుమారు 7, 8 సంవత్సరముల వయస్సు నుండి విద్యాభ్యాసము చేయునారంభించిరి. 1921 వ సం॥ వరకు అనగా 18 సంవత్సరములు వయస్సు వచ్చువరకు అట్లు విద్యాభ్యాసముచేసి అప్పుడొక వర్తకుల యొద్ద లేఖకోద్యోగమునఁబ్రవేశించి 1935 వ సంవత్సరమువరకు అట్లు వుద్యోగమునందుండిరిగాని చదువు మానలేదు. అప్పటికి ఆయనకు మొదటిజీతమునకు నాలుగురెట్లు జీతము ఈయబడుచుండెను. 21 వ సంవత్సరము వీరికి వివాహమైనది. వధువునకు 7 సంవత్సరములువయస్సు. వీరు 28 సంవత్సరముల వయస్సువరకు నిర్మల బ్రహ్మచర్య దీక్షా పరతంత్రులై యుండిరి. వీరు 1925 లో పురాణము చెప్పనారంభించిరి. 1935 వరకు అట్లు చెప్పుచుండి ఆ సంవత్సరమున పర్యటనము ప్రారంభించిరి. 1935 లో విశాఖపట్టణములోను, 1936 లో విజయనగరములోను, 1937 లో అనకాపల్లిలోను, 1938 లో రాజమహేంద్రవరములోను,

1939 లో ఏలూరులోను, 1940 లో వేంకటగిరిలోను, 1941 లో కొంచెము కాలము శ్రీ కాళహస్తి లోను పురాణము చెప్పిరి. ఆ సంవత్సర శ్రావణమాసమున (అనగా ఆగష్టులో) కాకినాడలో పురాణము చెప్ప నారంభించి, సుమారు 10 మాసములు తులసీరామాయణము చెప్పిరి. తదనంతరము భాగవతము రెండు సంవత్సరములు చెప్పిరి. ఇట్లు పురాణములు చెప్పుటలో అన్ని పట్టణముల కన్నను ఎక్కువకాలము కాకినాడలోనుండి మనపైని అధిక అనురాగము చూపినందులకు వారికివందనము లర్పించవలసియున్నది. ఈకాలమునవారు ఈశ్వరానుగ్రహమున ఇరువురు పుత్రరత్నములను పడసినందులకు కాకినాడపై వారికి సార్వకాలము సంపూర్ణమైన ప్రేమ ఉండక తప్పదు.

## పురాణముచెప్పు విధానము.

ఈ మూఁడు సంవత్సరములుగా ఈ మహనీయుని వాగమృతధార తనివిదీర గ్రోలుచుండినమహాశయులకు ఆ పురాణముచెప్పు విధానో త్కృష్టతను వర్ణించిచెప్పుట కవసరమించుకంతయు నుండజాలదు. వీరు చెప్పునది పుక్కిటి పురాణముగాక మనోహర ప్రబోధమగుచున్నది. పరసవేది సోకిన యినుము పదారువన్నె బంగారమైనట్లు వీరి వాగమృతధార చెవులసోకినంతనె నా వంటి పతితుండుకూడ సజ్జనుడగుననిన నిఁక యితరులమాట చెప్పనేల. భగవద్గీత యనుగ్రంథమొకటి కలదని తెలియని వారికిసహా ఆ గ్రంథమందలి ఉపదేశ వాక్యములు నిరంతరమును హృదయమున ప్రతిధ్వనించునట్లు చేసిన మహనీయున కెంతేని కృతజ్ఞులమై యుండవలసియున్నది.

## శాఖాహారము

వీరు మత్స్య మాంసాశనము నిషేధముకాని కులమున జన్మించినను వానిని పూర్తిగవర్జించిరి. వీరు "అహింసా పరమోధర్మః" అను నార్యోక్తిని పాటించి "మానవుడు దానవుడా" అను గ్రంథమును వ్రాసిరి.

## వీరి ప్రబోధ ఫలితము.

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" యనినట్లు ఈ మహానుభావుడు అధర్మమును, అసత్యమును, అనాచారములను అనాయాసముగా అతిదూరమునకు తరిమివేయుటయే గాక తత్ స్థానమున ధర్మమును, సత్యమును, నీతిని సదాచారముల నెలకొల్పు చున్నారనుటకు సందియము లేదు

గదా. వీరిప్రబోధము ఈశ్వరాను గ్రహమువలన ఇంకను సాగుచుండు నేని ప్రజలెల్లరును 'సత్యంవద, ధర్మంచర' యను నియమములను పాటించుటచే మన సివిలు, క్రిమినలు కోర్టులలో పని తగ్గవచ్చును. వీరి ప్రబోధమునందలి వాక్యములు ఎవరికైనను తాత్కాలికముగా అహితముగానుండినను అవిమిరియాలకషాయపు కారమువలె శాశ్వతమైన మేలు చేయగలవగును. ఇదిగాక వీరి వాక్ చమత్కృతిచేత ఆ కషాయమున్ను చక్కెరకలిపిన పానీయమువలె హాయిగా నుండునుగాని అహితముగా నుండుటలేదు.

వీరిది సార్థకనామము.

తలిదండ్రులు నోచిన నోముల ఫలమే యీ యప్పరాయలవారు కావున వీరికి నోముల అప్పరాయలను నామము సార్థకమగుచున్నది.

వీరివలన మనము గ్రహించవలసినది.

ఇట్టి మహనీయునివలన మనము గ్రహించ వలసినది మొదట పరమేశ్వరుని భక్తి, రెండవది మనోవాక్కాయకర్మలయందు పవిత్రులమై వర్తించుట. మూడవది భూతదయగలిగి మన తోడిమానవులనెల్లరయెడ జాతిమతభేదవైషమ్యముల నావంతయు బాటింపక సమహిత పరిపూర్ణ భ్రాతృప్రేమతో వర్తించుట. నాల్గవది 'సత్యంవద, ధర్మంచర' యను నార్యోక్తుల నిరంతరము పాటించుట.

శ్రీ అప్పారావుగారు కాకినాడలో 1947 వ సం॥రమున శ్రీ భజన సమాజము అనునొక సంఘమును స్థాపించిరి. ప్రస్తుత మా సంఘమున స్త్రీలు, పురుషులుకలసి 148 సభ్యులుగాచేరియుండిరి. ఆ సంఘము ద్వారా (1) గీతా శాస్త్రమును అందరుచదివి కంఠస్థము చేయునట్లు ప్రచారముచేయుట (2) ప్రతివారును ఆధ్యాత్మిక విజ్ఞానమును సంపాదించి పూజ, జప, సంకీర్తనాదులొనర్చునట్లు ప్రోత్సహించుట, (3) అహింసావ్రతము నవలంబించునట్లు ప్రతివారిని ప్రబోధించుట. ఈకార్యక్రమము ప్రధానముగా "శ్రీ భజన సమాజము" నేటికిని మిక్కిలిప్రచారము చేయుచున్నది.

శ్రీ పండితులవారు నేటికి సుమారు 27 గ్రంథములను సంస్కృతాంధ్రభాషలలో రచించిరి. అందు 20 గ్రంథములుమాత్రము ముద్రితములైనవి. ఈ గ్రంథములను 'ఆధ్యాత్మిక గ్రంథమాల' అను సంస్థద్వారా ప్రచురించుచున్నారు.

ఇంకమున్ముందు ఉత్కృష్టములగు గ్రంథములను ప్రచురింపనున్నారు. వీరే శ్రీ భజనసమాజము ద్వారా భగవద్గీతయందలి 18 అధ్యాయములను, శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము, శ్రీ అన్నపూర్ణాష్టకము మొదలగు ననేక ఆధ్యాత్మిక విజ్ఞానప్రద ప్రకరణములను ప్రచురించిరి. అయ్యది సామాన్యులకుగూడ నందుబాటులో నుండుటకు అధ్యాయమొక కానీ (0-0-3) చొప్పున విక్రయించుచు పలువురకుపకారమగునట్లు చేయుచున్నారు. ఈ ప్రచారముద్వారా ననేకులు ఆధ్యాత్మిక విజ్ఞానమును పొందుటకవకాశము కలదనుట నిశ్చయము.

శ్రీ అప్పారావుగారి ద్వారా నెలకొల్పబడిన సమాజముద్వారా ప్రతి దినము సంకీర్తనము, ప్రతి ఆదివారము గీతాపారాయణము, శ్రీరామనవమి శ్రీ కృష్ణజన్మాష్టమి మొదలగు పర్వదినములలో విశేష కార్యక్రమము జరిపించుటయేగాక, శ్రీ గీతాజయంతీ మహోత్సవము నొనర్చుచు సమాజముచే నియమించబడిన అధ్యాయములను కంఠస్థమొనర్చిన బాలబాలికలకు బహూకరణ మొనర్చుటయు జరుగుచున్నవి. శ్రీ అప్పారావుగారి జీవిత విశేషములను కొన్ని మాత్రము తెలుపగలిగితిని. తెలుపవలసినవి చాల గలవని విరమించుచున్నాను.

కార్యదర్శి,
శ్రీ భజనసమాజము, కాకినాడ.

## ఉపకార స్మరణ.

విజయవాడ ఆధ్యాత్మిక గ్రంథమండలి సంస్థాపకులు శ్రీ దిగవల్లి శేషగిరిరావుగారు తాము అనువదించి ప్రకటించిన శ్రీ జ్ఞానేశ్వరీ భగవద్గీత మూడుభాగములను మా గీతావాణి కార్యాలయమునకు ఉచితముగా నొసగినారు. వారికి మా వినమ్ర కృతజ్ఞతలు. రిజిష్టర్డ్ చార్జీలుమాత్రము కార్యాలయము భరించినది.

సంపాదకుడు,
— 'గీతావాణి.'

# గీతా తాత్పర్యము.

డా॥ యస్. రాధాకృష్ణ,
భారత ఉపాధ్యక్షుడు.

[ ఈ వ్యాసము సర్వేపల్లి రాధాకృష్ణయ్యాగారి ఇండియన్ ఫిలాసఫీ మొదటి సంపుటము తొమ్మిదవ ప్రకరణమునుండి గ్రహింపబడినది. తెలుగు చేయుటయందు శ్రీ చంద్రశంకర ప్రాణశంకర శుక్లాగారి గుజరాతీ అనువాదము నాకు మొదట తోడ్పడినది. తర్వాత శ్రీ బులుసు వేంకటేశ్వరులు M. A. గారి అనువాద గ్రంథము లభించినది. ఆ అనువాదకు లిద్దరకును మా కృతజ్ఞతలు. ఈ మీదట శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారి గ్రంథమునె సహాయముగ గొని ఆయా రచనలను ప్రకటింపదొడగుదుము. వారనువదించిన *భారతీయ తత్త్వశాస్త్రమునుండి పలయు ఘట్టములను యథేష్టముగ ఉద్ధరించి గీతావాణిలో ప్రకటించుటకు ఉదారమగు వారి అనుమతికూడ మాకు లభించినది. శ్రీ రాధాకృష్ణుని జ్ఞానగంగ యీ భగీరథుని ముఖమున ఆంధ్రభూమిపై సమగ్రముగ అవతరించునట్లు సర్వేశ్వరు డనుగ్రహించుగాక. — సం॥]



పరమ సత్యముయొక్క – పరమార్థ వస్తువుయొక్క స్వరూపమును గూర్చియు, మనుష్యుడు పొందదగిన పరమపురుషార్థమును గూర్చియు, గీతయొక్క సమకాలమునాడు వివిధములగు అభిప్రాయములు వ్యాపించియుండినవి. ఆత్మదర్శనమును – ఆత్మ సాక్షాత్కారమును ఉద్దేశించి ఉపనిషత్తుల ప్రణాళిక యేర్పడినది. ఆత్మ వేఱు; ప్రకృతి వేఱు. ప్రకృతి కర్త; ఆత్మ అకర్త – ఈ జ్ఞానమును (దీనినే వివేకఖ్యాతి యందురు) పొందినప్పుడే పురుషుడు ప్రకృతిపాశమునుండి విడివడి కైవల్యమనబడు మోక్షమును పొందునని సాంఖ్యుల సిద్ధాంతము. మనుష్యుడు తనకు విహితములగు నిత్యనైమిత్తిక కర్మముల నాచరించి పూర్ణత్వమును పడయగలడని కర్మమీమాంసకుల వాదము. హృదయమును పరిశుద్ధ

* భారతీయ తత్త్వశాస్త్రము, 2 భాగములు వెల రు. 10—0—0.
పలయువారు; బులుసు వేంకటేశ్వరులు M. A. గారు,
రామారావుపేట, కాకినాడ. అని వ్రాసిన పడయగలరు.

మొనర్చి దానిని పరమాత్మనియందు సంలగ్నము చేసి సర్వభావముల నాయనసె శరణుబొందుటచేత మోక్షానందమును బడయనగునని భక్తిమార్గీయుల తీర్మానము. బహువిధముల బహిర్ముఖములైన చిత్తవృత్తులను బంధించి సమాధిని పొందినపుడు ముక్తి లభించునని యోగుల అభిప్రాయము. ఇది యిట్లుండ – పరమాత్మని స్వరూపనిర్ణయమును గూర్చియు అభిప్రాయభేదముండెడిది. పరమాత్ముడు నిర్గుణ నిర్విశేష పరబ్రహ్మరూపుడని కొందరును, సగుణ సవిశేష యీశ్వరస్వరూపుడని కొందరును భావించెడివారు. భిన్నములగు ఆ మతములను సమన్వయపఱచి, అఖండమును యేకరూపమునునగు సిద్ధాంతమును ప్రతిపాదించుటకై గీత పరిశ్రమించినది. అందువలనసే, ఆ గీతయందు పరమపురుషార్థసిద్ధిని – దాని సాధనములనుగూర్చి చెప్పునపుడు అన్యోన్యవిరుద్ధములగు మతవిచారములు చెప్పబడియుండినట్లు గోచరించును. నూటికి నూరుగను ఒక్కేరూపమగు సిద్ధాంతము గీతయందు లేకపోవుటబట్టి దాని కారణములు విధవిధముల పలువురు లేఖకులు పేర్కొనిరి. భిన్న శతాబ్దములలో భిన్న వ్యక్తులు గీతా గ్రంథరచనములో భాగ్యోనిరని గార్బే హాప్కిన్స పండితులభిప్రాయపడిరి. గార్బే అభిప్రాయమునుబట్టి మూల గీత క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దమున రచింపబడినది. సాంఖ్యయోగముల నాధారము చేసికొని సగుణ బ్రహ్మవాదమును ప్రతిపాదించుటకై అది బయలుదేరినది. కాని క్రీస్తు వెనుక రెండవశతాబ్దములో ఉపనిషత్తులందలి నిర్గుణ బ్రహ్మవాదమునందు పక్షపాతముగలవారు తమ మతమునకు అనుకూలముగ దానిని మార్చిరి. మరియు గార్బే చెప్పునదేమనిన – "సగుణ బ్రహ్మవాదమును నిర్గుణబ్రహ్మవాదమును గీతయందు కలిసిపోయినవి. ఒక్కొకయెడ నేదోయొకటియు, ఒక్కొకచోట రెండును ప్రతిపాదింపబడుచు వచ్చినవి. ఈ రెండును సరిగ అతికినట్లు తోచని తావులుకూడ కొన్నికలవు. కొన్నిచోట్ల అతికి పొందియున్నట్లు గోచరించుచున్నను వాటి అతుకులు భద్రముగలేవు. ఒక సిద్ధాంతమును తగ్గించియు, మరొక్క సిద్ధాంతమును హెచ్చించియు చెప్పియుండుటకూడ లేదు. సగుణబ్రహ్మోపాసన పరమార్థ జ్ఞానమునకు ఆరంభదశయని కాని, నిర్గుణ బ్రహ్మవాదము తుది సత్యమని కాని యెచ్చటను పేర్కొనబడి యుండలేదు. పైపెచ్చు, యీ అభిప్రాయమునకు విరుద్ధముగ, ఈ రెండు వాదములకు మధ్య, శాబ్దికముగను తాత్త్వికముగను భేదమేలేనట్లు నిరూపించిన ఘట్టములు చాలమట్టుకు గ్రంథముననంతయు వ్యాపించియున్నవి." – అని గార్బేమాట. హాప్కిన్సు మరొక్క విధమున చెప్పియున్నాడు. – "తొలుత విష్ణువుయొక్క ఉపాసనను వర్ణించెడి కావ్యమొకటి యుండినది. రానురాను అది ఉపనిషత్తులలో గణింపబడుచు వచ్చినది. అదియే కృష్ణభక్తిరూపమున పరివర్తన మొనర్పబడి గీతయని వ్యవహరింపబడినది." "గీత మొదటిలో శ్వేతాశ్వతరోపనిషత్తు వంటి ఉపనిషత్తై ఉండినది. కాలక్రమమున

తగిన మార్పులొనర్చి కృష్ణభక్తికి అనుగుణముగ రూపెత్తింపబడినది." అని కీత్ పండితుడు చెప్పెను. "గీత తొలుత 'బ్రహ్మము విశ్వరూప' మనెడి సిద్ధాంతమును ప్రతిపాదించెడి కావ్యమైయుండినది. దానిని వైష్ణవ సాంప్రదాయకులు తమకనువగునట్లు మార్చుకొని" రని హాప్కిన్సుమక్

"వివిధములగు సిద్ధాంతముల కోలాహలమున గీతాకారుడు తికమకపడిపోయె"నని బార్నెట్ చెప్పెను. ఉపనిషత్తులందలి అద్వైతసిద్ధాంతము కాలక్రమమున బిగువు తప్పియున్న సమయమున గీత రచింపబడినది. అప్పటి తత్త్వవిచార ప్రవాహము, సేశ్వరవాదము - సగుణ బ్రహ్మవాదము గుండా జారి జగత్తు సత్యమని పల్కెడి నిరీశ్వరవాదము తట్టు మ్రొగ్గదొడగె" నని డాయసన్ నుడివెను.

నిజమునకు యీ యూహాలందెద్దానిని గూడ మన మొప్పుకొనవలసిన పనిలేదు. మహాభారత కాలమున దేశమునందుప్పతిల్లిన నూతన పరిస్థితులకు తగినట్టు ఉపనిషత్తుల ఆదర్శమును ప్రతిపాదించుటకై గీత బయలుదేరినది. సేశ్వరవాదము తట్టు - భక్తిమార్గమువైపు, మ్రొగ్గినవారి యెదుట నిర్గుణ బ్రహ్మవాదమును నిరూపించుచు, ఉపనిషత్తులలో చెప్పిన అద్వైత తత్త్వజ్ఞానముతోడ ఉపాసనను-భక్తిని మేళవించుటకు గీత ప్రయత్నించినది. ఉపనిషత్తుల లోని నిర్గుణబ్రహ్మవాదము చింతనపరాయణ మగుగాక ! అయినను అందుకూడ ప్రేమరసపూరితమును స్నేహమయమునునగు సగుణభక్తికి అవకాశము కలదని గీత ప్రదర్శించుచున్నది. మానవునియందు సహజముగ నుండు జ్ఞానభక్తిభావనలు పరాకాష్ఠదశను బొంది పరిపక్వమునైనపుడే, ఉపనిషత్తులు చెప్పిన నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారమునకు వీలుకల్గును. విచారమునకంటె ఆచారమునందు, తత్త్వచింతనకంటె ఉపాసనాభక్తియందు యెక్కువ గౌరవమును చూపిన గీతయొక్క పద్ధతి, అర్వాచీనములగు ఉపనిషత్తులందు సైతము పొడగట్టుచున్నది. అందుకూడ, మానవరక్షకుడగు పరమేశ్వరుడు శ్రద్ధావంతుని ఆర్తనాదమును ఆలకించి బదులాడగలడు. ఉపనిషత్తులు ప్రతిపాదించిన సత్యమనెడి పునాదిపై, ఆచార విచారవ్యవస్థయనెడి భవనమును గీత నిర్మించినది. ఈ ఆధ్యాత్మిక సమన్వయమునకై గీత కృషిచేసినది. అది పరిశ్రమించి సాధించిన సమన్వయము నేడు భారతీయ ప్రజానీకమునందు కల్యాగతమై వొంటబట్టిపోయినది.

వివిధ తత్త్వభావ సిద్ధాంతములను సమగ్రమైన యొక పూర్ణతత్త్వములోనికి దెచ్చి గీత సమన్వయింపగల్గినదా యను విషయమును ముందు మనము చూడగలము. పరస్పర విరుద్ధములగు తత్త్వసిద్ధాంతముల నొక్కత్రాటిపై నిలిపి, భగవద్గీత వాటికి ఐకమత్యమును సాధించినదని భారతీయ తత్త్వవేత్త లొప్పుకొనినారు. గీతాకారుడెంతటి నేర్పరి ప్రయత్నించియుకూడ ఆ వికలశకలములకు సుసంబద్ధరూపమేర్పరుప జాలకపోయెనని పశ్చిమ పండితులాడిన అభిప్రాయముల నింతకుముందు చెప్పియె

యున్నాము. ప్రస్తుతమీ ఆరంభచర్చయందా విషయమును త్రవ్వుకొనుటతో లాభము

జీవిత సమస్యలను పరిష్కరించుటయు, సదాచారమును ప్రోత్సహించుటయు గీత యొక్క ముఖ్యాశయములు. గీత చొక్కముగ నీతిధర్మగ్రంథము; అది యోగశాస్త్రము. నీతి ప్రధానమగు ధర్మమునకు పలుకుబడిగల యుగమునందు గీత రచింపబడినది. కావుననే ఆ యుగముయొక్క విచారములును — భావములును దాని యందు ప్రతిబింబించినవి. యోగశబ్దమున కెన్నియర్థములున్నను, మొత్తముమీద గీత, ఆచరణమునకు — కర్మయోగమునకు ప్రాధాన్యమిచ్చినది. యోగమనిన యీశ్వర ప్రాప్తి; లేదా, యీశ్వరసాక్షాత్కారము; విశ్వమును శాసించెడి మహాశక్తిని అను సంధానము చేయుట; బ్రహ్మసంస్పర్శము; బ్రహ్మసాక్షాత్కారము. ఆత్మయొక్క యే యొకానొక శక్తితో మాత్రము కాక — హృదయ మనస్సంకల్పములయొక్క యావత్తు శక్తులను యేకముఖము చేసి యీశ్వరనిష్ఠను సాధించుటయె యోగము. పరమాత్మతో తాదాత్మ్యమును సాధింపగోరెడి మనుష్యుని ప్రయత్నము యోగము. అట్టివాడు భోగైశ్వర్య ప్రసక్తిని యెదిరించి వెనుకకు నెట్టగలెడి దిట్టతనమును కలియుండవలెను. బాహ్యప్రకృతినుండి వచ్చి ఢీకొనెడి ఆఘాత విఘాతములను తాళితట్టుకొని తన సహజ శాంతస్థాయిని కోల్పోక నిల్చియుండుట విద్యయె యోగమనబడును. పతంజలియొక్క యోగదర్శనము మనస్సును సంస్కరించెడి శాస్త్రము. దానివలన బుద్ధిని నిర్మలమొనర్చి మనోభ్రమలను దూరముచేసి పరమ సత్యముయొక్క సాక్షాత్కారమును బొందవచ్చును. ఆయెడ జీవితమంతయు భగవంతునకు అఖండ పూజయై విలసిల్లగలదు. ఈ యోగ సహాయమున తన హృదయ నివాసియగు పరమాత్మని దర్శింపగలడు. చివరికీ మిణుగురునుండి ప్రచండపావకజ్వాల ప్రకటము కాగలదు. వివిధములగు యీ యోగము లన్నియు వేర్వేరు మార్గములైనను చిట్ట చివరకు పరమయోగములోనికి — బ్రహ్మయోగములోనికి యివి చేరుకొనవలసి యున్నవి.

సదాచారమును ప్రతిపాదించెడి సందేశములు పరమసత్యమును సమర్థించునవి కాక పోయినచో, ఆ సందేశములు చిరకాలము జీవింపలేవు. కాబట్టి గీతచెప్పెడి యోగశాస్త్రమునకు మూలము బ్రహ్మవిద్యయైయున్నది. గీత బ్రహ్మవిద్య; అట్లే యోగశాస్త్రముకూడ. తత్త్వమునువిచారించునది కాబట్టి — యిది దర్శనశాస్త్రము. ఆచారకాండను ప్రతిపాదించునదగుటచే ధర్మశాస్త్రము. సత్యమును గూర్చిన బౌద్ధిక శోధన యిందు చెప్పబడినది. ఆ సత్యజ్యోతి మనుష్యుని హృదయమున వెలుగుటకు తగు ప్రయత్నమును చెప్పబడినది. ప్రతి అధ్యాయము తుదను దీనినే గీత పేర్కొనినది. "బ్రహ్మవిద్యాయాం — యోగశాస్త్రే" అను నీ సంకల్ప వాక్యము పురాప్రాచీనకాలము నుండియు ప్రచలితమైయున్నది. బ్రహ్మసంబంధమగు తత్త్వజ్ఞానమును జీవితమునందు మేళవింపజేసెడి సాధనను బోధించు శాస్త్రము భగవద్గీత.



# సానువాద శంకర భాష్య సమలంకృతము
## శ్రీమద్భగవద్గీత
అనువాదకులు
## శ్రీ స్వామి శుద్ధచైతన్యజీ.

(1954 జూన్ నెల సంచిక 20_వ పేజీ తరువాయి.)

భా:_ ఏకాధికరణత్వం ఘటాదివిశేష్యాభావే న యుక్తమితి చేత్ న ఇదముదకమితి మరీచ్యాదౌ అన్యతరాభావేపి సామానాధికరణ్యదర్శనాత్ తస్మాత్ దేహాదేః ద్వంద్వస్య చ సకారణస్య అసతః న విద్యతే భావః ఇతి.

అను:_ (ప్రియా!) ఘటము మున్నగు విశేష్యంబులేనిదికాగా (విశేషణ విశేష్యములకు – సత్ ఘటములకు) ఏకాధికరణత్వము (సామానాధికరణ్యము) ఘటింపదుగదా? యనిన అట్లనరాదు; ఏలయన ఎండమావులు (ముత్తెపుజిప్ప, త్రాడు) మున్నగువానియందు రెంటిలో నొకటి (ఉదకము, వెండి, పాము మున్నగు కల్పితాంశము) లేకున్నను ఇది యుదకము (ఇది వెండి, ఇది పాము) అని సామానాధికరణ్యము (ఇదమంశముచే ♦) కనబడుచునేయున్నది; కావున అసత్యంబగు దేహంబు మున్నగు (శీతోష్ణసుఖదుఃఖాది రూపంబగు) ద్వంద్వంబునకుగాని, దానికిం గారణంబైనదానికి (ప్రధానమునకు) గాని యునికి లేనిదేయగుచున్నది.

భా:_ తథా సతః ఆత్మనః అభావః అవిద్యమానతా న విద్యతే సర్వత్ర అవ్యభిచారాత్ ఇతి అవోచామ.

అను:_ అటులనే సర్వత్ర (సర్వదేశములయందు, సర్వకాలములయందు, సర్వవస్తువులయందు) ‡ వ్యభిచారము లేమిం జేసి సద్వస్తువైన యాత్మకు లేకపోవుట యనునది లేదని వచియించితిమి.

భా:_ ఏవమాత్మానాత్మనోః సదసతోః ఉభయోరపి దృష్టః ఉపలబ్ధః అన్తః నిర్ణయః సత్ సదేవ అసత్ అసదేవ తు అనయోః యథోక్తయోః తత్త్వదర్శిభిః.

---

♦ దేశము ఉన్నది కాలము ఉన్నది వస్తువు ఉన్నది యను విధమున.

‡ "ఉన్నది" యనబడు సదంశమునకు బదులుగా వాడెడి మఱియొక విశేషణము.

అను:— ఇట్లు వెనుక దెలిపియుండినట్టి సదసత్తులైన యీ యాత్మానాత్మల రెండింటియు నిర్ణయమును "సత్తు (ఉన్నది) సత్తే; అసత్తు (లేనిది)* అసత్తే" యని తత్త్వదర్శులు గనుగొనిరి.

భా:— తదితి సర్వనామ సర్వం చ బ్రహ్మ తస్య నామ తదితి తద్భావః తత్త్వం బ్రహ్మణః యాథాత్మ్యం ద్రష్టుం శీలం యేషాం తే తత్త్వదర్శినః తైః తత్త్వదర్శిభిః

అను:— "త" త్తనునది సర్వనామము (సర్వాత్మకమగు బ్రహ్మముయొక్క నామము.) సర్వము బ్రహ్మంబే యయియున్నది; కావున నట్టి బ్రహ్మంబుయొక్క నామము "తత్" ఆయెను. అద్దానియొక్క భావము తత్త్వము అనగా బ్రహ్మముయొక్క యథార్థస్థితి; అట్టిస్థితిని దర్శించు స్వభావముగలవారు తత్త్వదర్శులనంబడెదరు.

భా:— త్వమపి తత్త్వదర్శినాం దృష్టిం ఆశ్రిత్య శోకం చ మోహం చ త్యక్త్వా శీతోష్ణాదీన్ తితిక్షస్వ ఇతి అభిప్రాయః.

అను:— నీవును అట్టి తత్త్వదర్శుల దృష్టి నాశ్రయించి శోకంబును మోహంబునున్ను విడనాడి శీతోష్ణాదులను సహింపుమని యభిప్రాయము.

భా:— కిమ్పునః తత్ సత్ యత్ సర్వదైవ సత్ ఇత్యుచ్యతే.

అను:— ఎయ్యది సర్వదా (ఎల్లవేళల) సత్తని చెప్పంబడుచున్నదో, అట్టి సద్వస్తు వింకను ఎట్టిదయియున్నదియు దెలుపుచున్నాడు.

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి॥　　17

భా:— అవినాశి న వినష్టుం శీలం అస్య ఇతి తు శబ్దః సతః విశేషణార్థః తద్విద్ధి విజానీహి.

అను:— అయ్యది యవినాశి (నశింపకుండునట్టి స్వభావము గలది) యని యెఱుంగుము. ఇట "తు" అనుశబ్దము సద్వస్తువుయొక్క విశేషణార్థకము.

భా:— యేన విష్ణ్వాఖ్యేన బ్రహ్మణా సర్వమిదం జగత్ తతః వ్యాప్తం సాకాశం ఆకాశేనేవ ఘటాదయః.

* మాయాది స్థూలాంతమైన సమస్తము.

అను:_ వినాశనంబడు నా(బహ్మంబీ సమస్తంబైన జగత్తును ఆకాశంబు ఘటాదులవలెనే వ్యాపించియున్నది; మఱియు నీయాకాశంబును♦ సయితమది వ్యాపించియున్నది.

భా:_ వినాశమదర్శనమభావః అవ్యయస్య అస్య న ఏతత్ సదాఖ్యం బ్రహ్మ స్వేన రూపేణ వ్యేతి నిరవయవత్వాత్ దేహాదివత్; నాప్యాత్మీయత్వేన ఆత్మీయాభావాత్ యథా దేవదత్తః ధనహాన్యా న త్వేవం పరబ్రహ్మ వ్యేతి అతః అవ్యయస్య అస్య బ్రహ్మణః వినాశం న కశ్చిత్ కర్తుం అర్హతి న హి కశ్చిత్ ఆత్మానం వినాశయితుం శక్నోతి ఈశ్వరోఽపి.

అను: సత్తనంబరగిన యీ బ్రహ్మంబు నిరవయవంబగుటవలన దేహాదులవలె స్వరూపంబున వికారంబు నొందుటలేదు; కావున నవ్యయమయియున్నది; మఱియు నాత్మీయంబయి (తనదిగా) యున్నందున ధనంబు నశించుటచే దేవదత్తుండు నాశంబు (హాని) నొందు విధంబున నీ బ్రహ్మంబు వినాశంబు (అదర్శనము — అభావము — లేకుండపోవుట) నొందుటలేదు. ఏలయన బ్రహ్మంబున కాత్మీయంబైనది లేదు. ఇట్టి యవ్యయం (నిర్వికారం) బగు బ్రహ్మంబున కెవ్వడును (ఈశ్వరుండుగూడ) వినాశంబు గలిగింప జాలడు.

భా:_ ఆత్మా హి బ్రహ్మ స్వాత్మని చ క్రియావిరోధాత్ యథా చక్షుర్గతరేఖాదీన్ చక్షుః న పశ్యతి.

అను:_ (సర్వమునకు) ఆత్మ (స్వస్వరూపము) గదా బ్రహ్మము! తన యాత్మయందు (ఈశ్వరుని కాత్మయగు బ్రహ్మమునందు) తనకు (ఈశ్వరునకు) క్రియ* యేర్పడదు కంటియందుగల రేఖలు (పుట్టుమచ్చలు) మున్నగువానిని కన్ను చూచుకొనలేదుగదా!

(సశేషము.)

♦ ఆకాశము "ఉన్నది" యనినప్పుడాయాకాశమందు గల యునికిరూపమున "ఉన్నది" యనబడు నాసదంశమునుండి వేఱుచేసినచో నీయాకాశము మిథ్యయై పోవుచున్నదని యర్థము.

* వినాశక్రియ _ సంహారక్రియ.

# స్వస్వరూపజ్ఞానము.


వేదాంతపితామహులగు శ్రీరాజేశ్వరానందస్వాములవారు, M.A., D.Litt.,

సంపాదకులు — ఆత్మవాణి.




స్వయముగా, స్వతంత్రముగా, సాధనాపేక్షరహితముగా జాగ్రత్స్వప్న సుషుప్త్యాది సర్వప్రపంచమును ప్రకాశింప చేయునది ప్రత్యగాత్మ. అయ్యది సూర్య, చంద్ర, అగ్ని, నక్షత్రములచే ప్రకాశితము గాదు. సర్వేంద్రియములును స్వప్నములో బుద్ధియందు లీనముకాగా, ఆబుద్ధిమాత్రము శేషించి, తన్నుఁ బ్రకాశింపజేయు ప్రత్యగాత్మప్రకాశ సహాయముచే, ఆ అవస్థయందలి కల్పితపదార్థములను జూచును.

బుద్ధ్యుపాధికంటె ప్రత్యగాత్మ వేరు. పిండి, పంచదార కలిసియున్నప్పుడు తీపి పంచదార స్వభావమనియు, పిండికి తీపిలేదనియు యెట్లు హస్తాదులద్వారా విభాగము చేయుటకు వీలులేకపోయినను నాలుకద్వారా చేయుచున్నామో అట్లే కర్మద్వారా విభాగము చేయుటకు వీలులేక పోయినను, జ్ఞానదృష్టిద్వారా ఆత్మ వేరనియు, బుద్ధి వేరనియు విభాగింపవచ్చును. ఆత్మయొక్క స్వరూపము జ్ఞానమగుటచేత స్వప్నావస్థయందలి పదార్థములను ప్రకాశింపఁజేయువస్తువు ఆత్మయనియు, ప్రకాశింపఁ జేయఁబడుచున్న వ్యక్తిరూపమున సంచరించునది బుద్ధియనియు తేలికగా విశదమగును. ఆత్మయొక్క జ్ఞానశక్తి బుద్ధియందు వ్యాపించుటచే, సర్వవిషయములను బుద్ధి ప్రకాశింపఁ జేయుచున్నది. ఆత్మ స్వయంప్రకాశము; బుద్ధి పరప్రకాశము. బుద్ధియనగా నిశ్చయరూపము; విజ్ఞానమయ కోశము; మహదహంకారము; సర్వసంసార సంస్కారము లనాదినుండి బుద్ధియందే నిలిచియున్నవి. బుద్ధ్యుపాధికిని, ఆత్మప్రకాశమునకును యింతయైనను సంబంధము లేదు. ఆత్మ చైతన్యస్వరూపము, బుద్ధి జడము, సుషుప్త్యవస్థయందు సర్వేంద్రియములతో సహా బుద్ధియును లయమగును. అప్పుడు విషయము లేవియును లేవు. కావున సర్వవిషయాభావ మెక్కటియే కలదు.

"ఇతరము లేదు సుఖముగా నుంటిని" అనునప్పుడు, యేమియును లేదు అను లేమిని తెలుసుకొను తెలివిగలదు. "తెలియమి" యను అజ్ఞానము ఆత్మప్రకాశముచేఁ బ్రకాశింప బడుచు దృశ్యమగుచున్నది. అజ్ఞానముకంటె వేరు దృశ్యములగు పదార్థములు లేవు. సర్వ

ఉపాధి వినిర్ముక్తుఁడై, స్వయంప్రకాశ స్వరూపుఁడై, జ్ఞానమాత్రుఁడైయుండు ద్రష్టగలఁడు. సుషుప్త్యవస్థకు సాక్షియై, అజ్ఞానమునకు విలక్షణమై, ప్రకాశకమైయుండు ద్రష్టయే ప్రత్యగాత్మ. 'అస్మ' చ్ఛబ్దమున కీ ప్రత్యగాత్మయే యర్థమని స్పష్టమగుచున్నది. ఇట్టి సర్వకాల సర్వావస్థలయందును, భూతభవిష్యద్వర్తమాన కాలములయందును, ఏకరసమై, నిత్యమై, నిరాకారమై, నిర్గుణమై, జ్ఞానమై ప్రకాశించును. సుషుప్త్యవస్థయందలి సుఖము, ఆత్మకు స్వస్వరూప భూతమైన ఆనందమే, అన్యముగాదు. ఈ విధముగా నాత్మనుపాధుల కంటె వేఱుగను, నిరంతరప్రకాశక స్వరూపముగా నుండును.

ఒకని నిద్రయందు కలుగు స్వప్నప్రపంచము, స్వప్నావస్థ పదార్థములు బ్రహ్మదేవునిచే సృజింపఁబడలేదు. వానికి సృష్టికర్త మనస్సే. అదేవిధమున జాగ్రత్సంసారము గూడా మనోకల్పితమే కావున నిది యసత్యము, భ్రాంతివిలసితము నని యనంబడును. "మాయామాత్రమిదం ద్వైతం అద్వైతపరమార్థతః" మనస్సనినను, బుద్ధియనినను యొకటియే. అంతఃకరణ వృత్తి భేదములుమాత్రమే. మనస్సుండిన జాగ్రత్స్వప్నములందు సంసారమున్న దనుట అన్వయము; సంసారము లేని సుషుప్త్యవస్థయందు మనస్సు లేదనుట వ్యతిరేకము. అన్వయవ్యతిరేక న్యాయమునుబట్టి జీవవ్యవహారమే సంపూర్ణభ్రాంతి.

ఇహలోకమునం దాధివ్యాధులకు వశీభూతమైన స్థూలదేహముద్వారా యానందానుభవమును పొందలేక వేదవిహితములైన యజ్ఞయాగాది కర్మలచేత పుణ్యము సంపాదించి, సూక్ష్మదేహముద్వారా పరలోకమునందానందము ననుభవించుటకు మానవుఁడు సంకల్పించుట సహజము. పుణ్యము సమాప్తమైన వెంటనే తిరిగి ఇహలోకమునకే వచ్చుచున్నాఁడు కావున ఇహపర భోగవిరాగము ముఖ్యమగుచున్నది. తను మనఃప్రాణములను త్యజించునట్టి కర్మ జ్ఞానోదయమునకు సహకారి. జ్ఞానము మోక్షసాధనము. పారమార్థిక దృష్టితో ప్రపంచమం దుండవచ్చును కాని, ప్రపంచ దృష్టితో పారమార్థికమందుండరాదు – యుండుటకును వీలులేదు.

సత్యమును సత్యముగా భావించుటగాని, చెప్పుటగాని యసత్యమే యగును. పరమార్థ స్వరూపమైన నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, సత్యము అవాఙ్మానసగోచరము. భౌతిక ప్రపంచము యజ్ఞానకార్యమైన యంతఃకరణాదులచేత కల్పితమైనది. అంతఃకరణము సహా దానియందు దోచు జీవేశ్వర జగజ్జాలమంతయు మిథ్యాకల్పితమను నిశ్చయానంతరమును యాత్మానుభూతికి పూర్వమున్ను పైనదెలిపిన అంతఃకరణాదులు "వికారము నొందక వినర్తమైయుండు" అనునదియే అభ్యాసమగు మార్గము. సత్యముకన్న నన్యము లేక పోవుటచేత సత్యమునే ప్రతివారును వ్యవహరించుచున్నారు. ఇట్లువ్యవహరించుట అసత్యము. సదా అవ్యవహారము; అగ్రాహ్యము; అచింత్యము.

మిథ్యాకల్పితస్వప్నము సత్యమా? అసత్యమా? అనునది కాక స్వప్నమును గాంచుటయను వ్యవహారమే యసత్యము.

ఈ విధమున జడమగు యంతఃకరణాదింద్రియాదులు జడములుగనే యుండవలెను. అజడములని విపరీతారోపణము కలుగకూడదు. ఈ విధముగ బుద్ధ్యాదింద్రియము లణగ ద్రొక్కఁబడిన తరువాతఁ దనయందుఁ దనకు నిశ్చయము కలుగునట్లు (విజృంభణము లేమిచే) తత్త్వజ్ఞానము సాధనాంతరాపేక్ష లేక ప్రకాశించుటకు వీలగును. 'దేహము' 'దేహి' యను వివక్షన చేత యేక క్షేత్రజ్ఞుడు, సర్వ క్షేత్రములయందును సత్యమై, నిత్యమై యుండుటను గ్రహించుట తత్త్వజ్ఞానము. క్షేత్రసంబంధమైనను మనోనిగ్రహము, వాసనా క్షయము, త్రికాలాబాధితమైన సత్యమగు క్షేత్రజ్ఞునియందు ఒక్కప్పుడును యించుకేనను లేమియే తత్త్వజ్ఞానము, మనోనిగ్రహము, వాసనాక్షయము యేక కాలమందే కలుగునను భావము. క్షేత్రములు మాసాధి ఘోరుగ కల్పనలలోఁబడినవి. క్షేత్రజ్ఞుఁడు వీనికి లోఁబడక యుత్పత్తి వినాశములులేక స్వయంప్రకాశమానముగ, సచ్చిదానందరూపముగనున్నాఁడు.

జన్మ కర్మ దేహము లనంబడు ఈ మూడును ప్రారబ్ధాధీనంబులు. కర్మ జన్మ ప్రదము, జన్మ దేహప్రదము, దేహము కర్మప్రదము. ఇట్లీమూడును చక్రాకారముగ తిరుగు చుండును. అనుభవింపఁబడునది ప్రారబ్ధము. కావలయుననుకోరిక ఆగామి. శేషించి యుండుట సంచితము. ప్రారబ్ధము భోగముచేతను, ఆగామి త్యాగముచేతను, సంచితము జ్ఞానముచేతను బాధింపబడుచున్నది. ఈ మూడు కర్మముల మర్మములను యీ విధముగ తెలిసికొనుటయే పురుష ప్రయత్నము. (సశేషము.)

---

## గ్రంథ స్వీకారము.

### 1. శ్రీ కృష్ణశతకము:—

గ్రంథకర్త:— డాక్టరు జి. వి. అప్పారావుగారు.

ప్రచురణకర్త:— జి. వి. నరసింహారావుగారు, సూపరింటెండింగు యింజనీరు గారు, విజయవాడ. వెల వేయలేదు.

సాత్త్వికభక్తులు — సంపన్న గృహస్థులునైన శ్రీ అప్పారావుగారు మాకు చిర పరిచితులు. వీరు త్యాగమూర్తులగు శ్రీ ఓంకారస్వాములవారి ప్రియశిష్యులు "కోటి జన్మార్జితైః పుణ్యైః — కృష్ణే భక్తిః ప్రజాయతే" — అన్నట్లు బహుజన్మ పుణ్యమున తమకు కల్గిన కృష్ణభక్తిని ఈ గ్రంథరూపమున వెల్వరించి యున్నారు.

### 2. శ్రీ ముకుందమాల:— (ఆంగ్లానువాదసహితము) వెల 0-4-0

అనువాదకులు:— ఎ. యస్. జానకిరామ్, బి. ఎ., బి. యల్., యల్. టి.

ప్రకాశకులు: డివైన్ లైఫ్ సొసైటి, వెంకటగిరిటౌన్, నెల్లూరుజిల్లా.

శ్రీ కులశేఖరాళ్వారులవారి శ్లోకములు ఇంగ్లీషు అనువాదముతో చేర్చబడినవి. డాక్టరు శ్రీ శివానంద సరస్వతీస్వాములవారు తొలిపలుకులు వ్రాసినారు. వారి మాట లలో "The translation is easy and simple. It conveys the correct feelings of the author" అని ప్రశంసించబడినది.

### 3. పుష్పవల్లి (ఖండకావ్యము) వెల 0—8—0.

కవి:— కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు, పామర్రు పోష్టు, కృష్ణాజిల్లా.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తోమ్మంద్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, ఎర్రగుంట్లపోస్టు. - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15 శ్రీ పోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.

నెల్లూరుజిల్లా: 20. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్‌పేట, నెల్లూరు. 21. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 22. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 23. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 24. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 25. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పెట్ - 26. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణ దేవరకెరె. - 27. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా. - 28. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

# గీతావాణి — పోషకవర్గము:

నైజాంస్టేట్: 29. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. — 30. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ — 31. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

32 గ్రంథె నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లేవీధి, మద్రాసు.

తూర్పుగోదావరి జిల్లా:— 33. శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా:— 34. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులుగారు, పాలకొల్లు. 35. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ — భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

కృష్ణాజిల్లా:— 35. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. — 36. శ్రీభట్టిప్రోలు సత్యనారాయణరావుగారు. సర్కిల్ పేట, బందరు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యపురాజుగారు, గోసపాడు. — 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. — 3. శ్రీ చాటకొండు ఓబులేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. — 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. — 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. — 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. — 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. — 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. — 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. — 10. శ్రీ మదర్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. — 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. — 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. — 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. — 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, — కోయిలకుంట్ల. — 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం. — 16 శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరుగ్రామం, యర్రగుంట్ల పోస్టు.

కడపజిల్లా. 17. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ 18... శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దుటూరు. — 19. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. — 20. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. — 21. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 22. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 23. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 24. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 25. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ. పెరియంబాడి. — 26. శ్రీ సటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

# గీతావాణి – పోషకవర్గము

అనంతపురం జిల్లా: 27. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. – 28. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. – 29. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు రాగలపాడు. – 30. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. – 31. శ్రీ కె. చౌడయ గారు, జమీందార్, మిణకనగుర్కి. – 32. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరుతా॥ – 33. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 34. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 35. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. – 36. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. – 37. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. – 38. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. – 39. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి – 40. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. – 41. శ్రీ శాకల ఆంజనేయులు గారు, కుందనగుర్తి. – 42. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.

నెల్లూరు జిల్లా: 43. శ్రీ బ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కనుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 44. శ్రీ శంకరనాయుడుగారు, కార్యూరు.

మైసూర్ స్టేట్: 45. శ్రీ కాకుబాళ అంబణ్ణ శ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 46. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 47. శ్రీ కె. ఆర్. సీతారామయ్య శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 48. శ్రీ కె. నంజప్ప శ్రేష్ఠిగారు, బంగారుపేట. 49. – శ్రీ నారాయణమూర్తిగారు, c/o మూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. కోలారు. – 50. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 51. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. – 52. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. – 53. నాగబండి విశ్వనాథం గారు, 12/88 మెట్టురోడ్డు, వరంగల్. – 54. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ – 55. శ్రీ గంటె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్ – 56. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు. కిరాణదుకాణం, వరంగల్ – 57. శ్రీ తాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ – 58. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ – 59. శ్రీ మడూరు బసవలింగంగారు, వరంగల్ – 60. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ – 61. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ – 62. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు వరంగల్ – 63. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్ – 64 శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్. – 65. శ్రీమతి కామేశ్వరమ్మ గారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్ – 66. శ్రీ సోమా నరసయ్య గారు, వరంగల్ – 67. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ – 68. శ్రీ చండా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ – 69. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు. వరంగల్ – 70. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 71. సి. ఎస్. నాగరాజ శ్రేష్ఠిగారు, గోశ్శేగాలం.

## గీతావాణి — పోషకవర్గము.

కృష్ణాజిల్లా:— 72. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు. 73. శ్రీ బావినేని రామకోటయ్యచౌదరి, పరమాత్మానందాశ్రమము, గీతాభవనము, పెనమలూరు. — 74. శ్రీ అదూరి చలపతిరావుగారు. రున్తుంబాద్, బందరు. — 75. శ్రీ మోటుమర్రి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరిజిల్లా:— 76. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. — 77. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 78. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. — 79. శ్రీ మాధం శెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 80. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి.

పశ్చిమగోదావరి జిల్లా:— 81. శ్రీ ఆబోతుల రామన్నగారు, పాలకొల్లు. — 82. శ్రీ మామిడి సత్యనారాయణగారు, పాలకొల్లు.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు-16.
2. శ్రీ గజ్జహల్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మగారు, పొన్నమ్మగుడివీధి, చిత్తూరు.

---

## వార్తలు.

శ్రీ శంకరానందస్వాములవారు 1-9-54 తేదీకి ఆగరం శ్రీనివాసాశ్రమము చేరుకొన్నారు. 2-9-54 నుండి 8-9-54 వరకు శ్రీవారి భగవద్గీతోపన్యాసములు జరిగినవి. శ్రీ నేగు వేణుగోపాలగుప్తగారు అనువదించినారు.

9-9-54 నుండి 18-9-54 వరకు శ్రీ రామకృష్ణానందస్వాములవారు ప్రొద్దుటూరు శ్రీ కృష్ణ గీతాశ్రమమునందు భాగవత ఏకాదశస్కందమును ఉపన్యసించినారు.

12-9-54 నుండి 20-9-54 వరకు శ్రీ శంకరానందస్వాములవారు కుందవగుర్తి శ్రీ శివలింగాశ్రమమునందు పన్యసించినారు. శ్రీ శంకరానందగిరిస్వామివారు అధ్యక్షత వహించినారు. ఇరుపూటలును ఉపన్యాసములు జరిగినవి.

శ్రీ శంకరానందస్వాములవారి గీతోపన్యాసములు 21-9-54 నుండి 27-9-54 వరకు హాస్పేట శ్రీ గీతాసేవాశ్రమమునందు జరిగినది.

29-9-54 నుండి 7-10-54 వరకు కల్యాణదుర్గమునందు శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానములో శ్రీ శంకరానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు జరిగినవి. శ్రీ రామకృష్ణగారు అనువదించినారు.

10-10-54 నుండి 19-10-54 వరకు చిత్తూరు జీవకారుణ్య అన్నదాన సమాజములో శ్రీ శంకరానందస్వాములవారి గీతోపన్యాసములు జరుగగలవు. శ్రీ రామకృష్ణగారు అనువదించెదరు. పూజ్యపాద శ్రీ శాంతానందస్వామివారు సభకు అధ్యక్షత వహింతురు.

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla.
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President,
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# ఆంధ్ర మహాజనులకు మా విజ్ఞప్తి.

పుణ్యమహాశయులారా !

భావనను పరిశోధించి, బుద్ధిని ప్రబోధించి, ప్రవృత్తిని పరిష్కరించి, మానవునకు సర్వతోముఖమగు ఆధ్యాత్మిక వికాసమును భగవద్గీత ప్రసాదించగలదు. భౌతికశక్తి ఊహాతీతమగు వికాసమును బొందిన యీ వైజ్ఞానిక యుగమున, ఆత్మశక్తి వికాసమును చేకూర్చెడి గీతాతత్త్వప్రసార ప్రచారములెంతేని అవసరము. ఈ రూపమున జనతాజనార్దనుని సేవించుటకై భగవంతునిపై భరోసాపెట్టి మా గీతావాణి బయలుదేరినది.

ఈ పత్రికకు మూడేండ్లుగడిచి నాల్గవయేడు పడినది. ఆర్థికముగ నెన్నో ఆఘాతముల నెదుర్కొనుచున్నది. వ్యాపార ప్రకటనలతో ద్రవ్యము నార్జించు పద్ధతి యీ ఉద్యమమునందు చేర్చదలంచలేదు. గడచిన మూడేండ్లకును మూడువేల రూపాయలు నష్టమేర్పడినది. డబ్బును మ్రింగుటలో పత్రికాఉద్యమము సురసాముఖమువంటిదని ఆ పరిచయముగలవారికి తెలియకపోదు.

మహనీయులారా! విశాలమగు తెలుగుగడ్డపై, విస్తారమగు తెలుగుభాషలో గీతాప్రచారమునకు ఏకైక పత్రికగావిలసిల్లు గీతావాణికి తగిన ఆదరాభిమానములు లేకుండుట మిగుల శోచనీయము. పత్రికలను అందుకొనుచుకూడ తమ చందాలను యింతవరకు పంపని వారుకూడ నున్నారు. మీరు చందాపంపుటెగాక, మీ మిత్రులను కూడ చందాదారులనుగ ప్రోత్సహించి చేర్పించండి. భోగప్రవృత్తిని, పశుజీవితమును ప్రోద్బలించెడి సంస్థలకు మీ ద్రవ్యము వ్యయమగుచునేయున్నది. యోగప్రవృత్తిని ఋషిజీవితమును ప్రోత్సహించెడి సత్సాహిత్యమునకు తృణమో – పణమో, మీవద్దలేదా! ఈ గీతాజ్ఞానయజ్ఞమున మీపాలిటి శ్రద్ధాహుతిని సమర్పించి శ్రీ కృష్ణదేవుని అనుగ్రహమునకు పాత్రులు కావలెనని సనిరోధముగ ప్రార్థించుచున్నాము.

— మేనేజరు, గీతావాణి.

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు, జూలై 1954 కా. 1000.